శ్రీమతే రామానుజాయ నమః



## సాంప్రదాయిక వ్యాస మాలిక - 3

# గాయత్రి,
# పెరియవాచ్చాన్ పిళ్ళై వైభవం,
# ఆచార్యవాన్ పురుషో వేద


**అనువాదకులు:**

పండితరత్న, ఉ.వే.శ్రీమాన్
ఈయుణ్ణి అళ్గియ శింగరాచార్య స్వామి వారు

**సంపాదకుడు:**

ఈయుణ్ణి అనంత రంగ రామన్





‘న్యాయ వేదాంత విద్వాన్’

ఉ.వే. శ్రీమాన్ కార్పంగాడు  వేంకటాచార్యస్వామి వారు



‘శ్రీవైష్ణవ సింహ’

ఉ.వే. శ్రీమాన్ తిరుమలై అనందాన్ పిళ్ళై కృష్ణమాచార్య

స్వామివారు, తిరుపతి





**‘న్యాయవేదాంత విద్వాన్’**
**ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారు, నరసాపురం**

**శ్రీమతే రామానుజాయ నమః**
**శ్రీమద్వరవరమునయే నమః**

# గాయత్రి

## (ఉ.వే. శ్రీమాన్ కార్వంగాడు వేంకటాచార్యస్వామి తమిళోపన్యాసం ఆధారంగా)

"త్రైవర్ణికాః ద్విజాః" అనే విధంగా భగవంతుడు సృష్టించిన నాలుగు వర్ణాలలో మొదటి మూడు వర్ణాలవారు ద్విజులని చెప్పబడుతున్నారు. ద్విజులు అంటే రెండు జన్మలు కలవారు అని అర్థం. **"కర్మణా జాయతే ద్విజః"** (ఉపనయనం అనే సంస్కారం ద్వారా రెండవ జన్మ కలుగుతున్నది) అనేది సూక్తి. కేవలం శారీరకర్మవల్లనే దిజత్వం కలుగదు. ఉపనయనం అనే సంస్కారం తరువాత ఈ రెండవ జన్మ కలుగుతున్నది. వేదాన్ని అధ్యయనం చేయాలని, బ్రహ్మజ్ఞానాన్ని పొందాలని సదాచార్యుని దగ్గరకు వెళ్ళినప్పుడు అతడు బ్రహ్మమనబడే పరమాత్మ దగ్గరకు జ్ఞానోపదేశం చేయడం ద్వారా తీసుకొని వెడతాడు. ఇదే ఉపనయనసంస్కారం. ఉపనయన సంస్కారాన్ని పొందిన తన పుత్రుని "నీవు బ్రాహ్మణుడవు అయ్యావా?" అని ప్రశ్నించడం పూర్వం పెద్ధలకు అలవాటు. ఉపనయనంలో ముఖ్యమైన అంగం గాయత్రీ మంత్రోపదేశం. "ఇది, పుట్టిన ఎనిమిదవ సంవత్సరంలోపల జరగాలి. ఆ విధంగా కాక '8వ యేడు తరువాత-10వ యేడు లోపు' ఉపదేశం చేయబడితే మంత్రం ఉపదేశాన్ని పొందినవానిదగ్గరకు ఆదరంగా చేరదు. 15 ఏండ్లు నిండితే ఉపనయనం చేయడం వ్యర్థం" – అని శాస్త్రం తెలుపుతున్నది.

ఉపనయనం అయిన తర్వాత ద్విజుడు జీవించినంత కాలం ప్రతి దినం మూడు వేళల సంధ్యావందనాన్ని చేసి, గాయత్రి జపాన్ని క్రమానుసారంగా చేయాలి – అనేది భగవానుని ఆజ్ఞ. గాయత్రి జపాన్ని, సంధ్యావందనాన్ని చేయకపోతే ఆ భగవానుని కోపానికి గురి కావలసి వస్తుంది. ఈ విధంగా సంధ్యావందనాన్ని, గాయత్రి జపాన్ని చేయనివాడు ఏ వైదిక కర్మను చేయడానికి తగిన యోగ్యతను కలవాడు కాడు. గాయత్రీ మంత్రాన్ని కనీసం 100 పర్యాయాలు జపించడం మంచిది. అధమపక్షం 10సార్లు అయినా జపించాలి. "**ధ్యాత్వా దేవం జపేన్మనుమ్**" అనేది క్రమం. ఈ మంత్రాన్ని ఇతరులు చెవిలో వినబడేటట్లు చెప్పరాదు. ఉపనయనంలో తండ్రి తన కుమారునకు రహస్యంగా గాయత్రిని ఉపదేశం చేస్తాడు. అష్టాక్షరీ మహా మంత్రాన్ని పెద్దలు సభలో గట్టిగా ఉచ్చరించడం కనిపిస్తుంది. కానీ, గాయత్రిని మాత్రం ఆ విధంగా ఉచ్చరించడం కనిపించదు. ఇది ఈ మంత్రంలోని గొప్పతనాన్ని తెలిపే ఒక ఆచారం.

ఈ గాయత్రీమంత్రం సకలవేదాలకు తల్లి. "**గాయత్రీ ఛందసాం మాతా**" అని సూక్తి ప్రసిద్ధమైనది. గాయత్రి ఛందస్సులలో ప్రధానమైనది అనేది ఇంకొక అర్థం. “**గాయంతం త్రాయతే ఇతి గాయత్రీ**" అని గాయత్రీ శబ్దానికి కొంతమంది వ్యుత్పత్తిని తెలుపుతారు. ఒక్కొక్క పాదంలో ఎనిమిది అక్షరాలు కలిగిన, మూడు పాదాలను కలిగినది ఈ మహామంత్రం అందువల్ల ఇందులో 24 అక్షరాలున్నాయి. ప్రణవాన్ని, "**భూర్భువస్సువః**" అనే మూడు వ్యాహృతులను చేర్చి మనం జపిస్తూ ఉన్నా, వీటి తర్వాత ఉండే మూడు వాక్యాలే గాయత్రీ మంత్ర స్వరూపం. ఈ మంత్రానికి పలువురు పలు విధాలుగా వ్యాఖ్యానం చేసినా, "ఏ పరమపురుషుడు మన జ్ఞానాలను ప్రేరేపించి నడిపిస్తున్నాడో,

జగత్కారణుడు, తేజోమయుడు అయిన ఆ పురుషోత్తముని ధ్యానిస్తున్నాము" అనేది ఈ మంత్రంలోని సారార్థం.

ఈ మంత్రంలో "**వరేణ్యమ్**" అని, "**వరేణీయమ్**" అని రెండు పాఠాలున్నాయి. జపంలో "**వరేణీయమ్**" అనే పాఠం, అర్ఘ్యప్రదానంవంటి సందర్భాలలో "**వరేణ్యమ్**" అనే పాఠం గ్రహించదగినవి అని పెద్దలంటారు. "**తేజస్య సవితుః, తత్ వరేణీయమ్ భర్గః ధీమహి**" అని మొదటి రెండు వాక్యాలలోని పదాలను అన్వయించుకోవాలి. "**దేవః**" – జగత్ వ్యాపారం అనే క్రీడలో ఆనందించేవాడు, "**సవితా**" – ఆదరణీయుడు, అందరికీ మంచిని చేసేవాడు, "**వరేణీయమ్**" – కోరదగిన, "**భర్గః**" – తేజస్సును, "**ధీమహి**" – ధ్యానిస్తున్నాము – అని ఈ విధంగా పదాలలో అర్థం. "జగత్తును సృష్టి చేసి, రక్షించి, లయంజేసే క్రీడలో ఆనందించే, జగత్తుకు కారణమైన, ఆదరించ దగిన తేజస్సును ధ్యానం చేస్తున్నాము" అని ఈ మంత్రంలో సామాన్యంగా తోచే అర్థం.

ఈ మంత్రంలో నిర్గుణ బ్రహ్మోపాసన తెలియజేయబడుతుంది – అని అద్వైతుల వాదం. శివుడే ఇందులో ధ్యానించదగిన దైవమని చెప్పబడుతున్నాడని శైవుల వాదం. శ్రీమన్నారాయణుడే ధ్యానానికి విషయమైనవాడు – అనేది శ్రీవైష్ణవుల సిద్ధాంతం.

ఈ మూడు వాదాలలో మొదటగా తీవ్రవాదాన్ని (శైవుల వాదాన్ని) గమనిద్దాం. నిఘంటువులలో గమనిస్తే "**భర్గః**" అనే శబ్దం శివుని నామాలలో ఒకటిగా కనిపిస్తుంది. తేజస్సును తెలిపే భర్గశబ్దం మంత్రంలో ప్రయోగింపబడినందున శివుడు ఈ మంత్రంలో చెప్పబడుతున్నాడు అనేది శైవుల వాదం. ఇది

సంస్కృత వ్యాకరణానికి పొసగదు. శివుడు అనే దైవాన్ని అర్థంగా కల శబ్దం అయితే ఈ శబ్దం రామశబ్దంవలె శివ శశబ్దంవలె అకారాన్ని చివర కలిగిన పుంలింగశబ్దంగా కావాలి. ఆ విధంగానే ఈ శబ్దం 'అ'కారాంత శబ్దం అయితే వ్యాకరణ శాస్త్రప్రకారం ఈ వాక్యం **"తం వరేణీయం భర్గమ్"** అని ఉండాలి. **"తత్ వరేణీయం భర్గః"** అనేచోట వ్యాకరణం ప్రకారం భర్గశబ్దం పులింగ శబ్దం కాదు, నపుంసక లింగ పదమే. అందువల్ల శివుడే ఉపాసించదగినవాడు – అని గాయత్రికి అర్థం చెప్పడం సంస్కృతవ్యాకరణ శాస్త్రానికి విరుద్ధం.

ఇక ఈ మంత్రం నిర్గుణబ్రహ్మాన్ని తెలుపుతున్నది అనే అద్వైత వాదాన్ని గమనిద్దాం. ఇక్కడ దేవ అనే శబ్దం "క్రీడతో ఆనందించేవాడు" అనే అర్థాన్ని ఇస్తుంది. జగత్ వ్యాపారమే ఇక్కడ లీలగా చెప్పబడుతున్నది. సృష్టి మొదలైనవానిని చేసి ఆనందించేవాడు – అని దీని అర్థం. ఆనందించేవాడు గుణం లేనివాడుగా ఉండే అవకాశం లేదు. అందువల్ల ఇక్కడ అద్వైతుల ఈ నిర్గుణవాదం పొసగదు. **"దేవః సవితా"** అనే రెండు పదాలు శ్రీ విష్ణు సహస్రనామస్తోత్రంలో ఉండే పదాలే. శ్రీపరాశర భట్టర్ తమ భాష్యంలో **"దీవ్యతి క్రీడతి ఇది దేవః"** అని వివరించి, పులి, వరాహం మొదలైన దుష్టజంతువులను దారంతో కట్టి ఆడినట్లుగా, మాయ అనే పాశంతో జీవులను కట్టి ఆడించేవాడు అనే అర్థాన్ని చెప్పారు. **"మాయాం తు ప్రకృతిం విద్యాత్ మాయినం తు మహేశ్వరమ్"** అనేది ఉపనిషత్ వాక్యం. త్రిగుణాలతో కూడిన ప్రకృతి అనే దారంతో భగవంతుడు జీవులను కట్టి వేస్తున్నాడు. పులి మొదలైన దుష్టమృగాలవలె జీవుడు కూడా ఒక దుష్టజంతువు. సృష్టి, రక్షణ, లయం అనేవి జగద్వ్యాపారాలు ఇవి. భగవానునకు లీల. **"అఖిలభువనజన్మ స్థేమభంగాదిలీలే"** అని శ్రీ భాష్యంలోని ప్రార్థనాశ్లోకంలో సూక్తి. **"పల పల మయక్కుక్కళాల్ ఇన్బుఱుమ్ ఇవ్విళైయాట్టుడైయాన్"** అని

నమ్మాళ్వారుల సూక్తి. "నన్ను ఆశ్రయించి కైంకర్యం చేసుకోనీ" అని పరమపురుషుడు జీవుని శరీరంతో కలిపి సృష్టించాడు. **"విచిత్రా దేహసంపత్తిః ఈశ్వరాయ నివేదితుమ్"** అనే విధంగా భగవంతునకు కైంకర్యం చేయడంకోసమే ఇవ్వబడిన ఈ శరీరాన్ని లౌకిక సుఖాలలో ఆసక్తులై ఉండే జీవులు వ్యర్థం చేయడం చూచి అతడు పగలబడి నవ్వుతాడు. ఇది ఒక లీల. చలిలో బాధపడే ఒక పేదవానికి ఒక ప్రభువు చక్కని శాలువా ఇస్తే, దానితో అతడు చలిని పోగొట్టుకోకుండా దానిని ముక్కలు ముక్కలుగా చింపి, మూటగా కట్టి భుజంపై పెట్టుకుని మోయడంవంటిది ఈ జీవుడు భగవంతుడిచ్చిన శరీరాన్ని వ్యర్థం చేయడం. ఇటువంటి జీవుని చూసి భగవంతుడు "వీడు ఎంత పిచ్చి వాడు!" అని తలుస్తాడు నవ్వుతాడు. అందువల్ల దేవశబ్దం గుణాలతో కూడిన పరమపురుషుని తెలుపుతుంది తప్ప నిర్గుణ బ్రహ్మాన్ని తెలుపదు.

**'సవితా'** అనే శబ్దం సూర్య మండలం మధ్యలో ఉండేవాడు, అన్నిటిని సృష్టించేవాడైన పురుషుని తెలుపుతుంది. ఇందువల్ల కారణత్వం చెప్పబడింది. కారణత్వం కూడా గుణాలలో చేరుతుంది. నిర్గుణ బ్రహ్మ జగత్కారణం అని ఇందువల్ల చెప్పే అవకాశం లేదు. అద్వైతులు, కారణత్వం అనేది తటస్థలక్షణం మాత్రమే, గుణం కాదు అని అంటారు. అంటే, "సూర్యుడు ఇంటి కొప్పు పైకి వచ్చాడు, ఇప్పుడు సమయం మధ్యాహ్నం 12:00 అవుతుంది" అని అంటే ఇంటికొప్పు అనేది ఆకాశంలో సూర్యుని ఉండే చోటును తెలుసుకోవడానికి సహాయపడుతుంది తప్ప, నిజంగా సూర్యుడు ఇంటి కొప్పుపైకి వచ్చాడనే అర్థాన్ని ఇవ్వదు. ఇంటికొప్పుకు సూర్యునకు ఉండే సంబంధమే బ్రహ్మానికి కారణత్వానికి ఉన్నది – అనేది అద్వైత వాదం. అయితే సూర్యమండలంలో ఉంటూ సూర్యుని ద్వారా వర్షం, పంటలు మొదలైనవానిని సృష్టించేవాడు సవిత అని శ్రుతిసిద్ధమైన అర్థం

కనుక, నిర్గుణ బ్రహ్మం సవితృ శబ్దానికి అర్థంగా చెప్పే అవకాశం లేదు.

**'భర్గ'** శబ్దాన్ని సకారాంత శబ్దంగానే గ్రహించి, దానికి తేజస్సు అనే అర్థాన్ని చెప్పి, మళ్ళీ శైవులు తమ వాదాన్ని కొనసాగించారు. అంటే, **"దేవస్య భర్గః,సవితుః భర్గః"** అని విడదీసినప్పుడు, పరమ పురుషుని తేజస్సు – అని అర్థం వస్తుంది. దేవుడు వేరు, తేజస్సు వేరు కనుక, పరమపురుషుని తేజస్సుగా శివుని గ్రహించి గాయత్రి శైవమంత్రం అని అంటారు కొందరు శైవులు. ఇది సరికాదు. ఎందుకంటే, ఎల్లప్పుడు "కలిగిన వాడు" అనే అర్థాన్ని ఇచ్చే షష్ఠీ విభక్తి, భేదాన్ని తప్పక తెలుపుతుంది – అనేది లేదు. "రాహువు శిరస్సు" అనే ప్రయోగాన్ని దీనికి ఉదాహరణగా భావించవచ్చు. ఇక్కడ శిరస్సు వేరు, రాహువు వేరు అని అర్థం కాదు. భేదం లేని చోట కూడా షష్ఠీ విభక్తిని ప్రయోగించి పలకడం కనిపిస్తోంది. సవితుః అనే పదం ఒక గొప్ప దైవాన్ని పలికుతున్నందున , దైవం వేరు, తేజస్సు వేరు – అని చెప్పవలసిన నిర్బంధం లేదు.

అందువల్ల, దేవుడే తేజస్సు – అని చెప్పాలి. ఈ సగుణుడైన దైవం 'సవిత'. ఇతడు ఎవరు? అనే విషయాన్ని వేదం మనకి స్పష్టం చేస్తున్నది. తైత్తిరీయ ఉపనిషత్తులలోని భృగువల్లి **"యతో వా"** ఇత్యాది వాక్యంలో "ఎవరి వల్ల అన్ని వస్తువులు పుడుతున్నాయో, ఎవరిచే ఇవి రక్షింపబడుతున్నాయో, ఎవనిలో లయం పొందుతున్నాయో, అతడిని బ్రహ్మగా తెలుసుకో" – అని చెప్పబడింది. శారీరక మీమాంసాశాస్త్రంలో కూడా "జన్మాద్యస్య యతః" అనే సూత్రంతో జగత్కారణవస్తువు చెప్పబడింది. ఈ జగత్కారణమైన బ్రహ్మం సవిత. సూర్యమండలంలోని అధిదేవత. ఛాందోగ్యంలో సూర్యమండలాంతర్వర్తి అయిన పరమ పురుషుడుచాలా అందంగా వర్ణింపబడ్డాడు. **"య**

**ఏషొంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే, తస్య యథా కప్యాసం పుండరీకమేవమక్షిణీ"** ఇత్యాదిగా ఆ పురుషుడు వర్ణింపబడ్డాడు. **"హిరణ్మయః పురుషః"** అని అన్నందున చాలా అందమైన రూపాన్ని కలవాడు అని, **"కప్యాసం పుండరీక మేవమక్షిణీ"** అని చెప్పబడినందున అతడు ఎర్ర తామరలవంటి నేత్రాలను కలవాడని తెలుస్తున్నది. ఇతడు శ్రీమన్నారాయణుడు తప్ప వేరొకడు అయే అవకాశం లేదు. **"దేవస్య సవితుః భర్గః"** అనే ప్రయోగానికి తేజోమయుడైన శ్రీమన్నారాయణుడు – అనే అర్థం వేదానికి అనుకూలమైన, అంగీకరింపదగిన అర్థం.

**"యః నః ధియః ప్రచోదయాత్"** అనేది మూడవ వాక్యం. "ఎవడు మన జ్ఞానాలను ప్రేరేపించి నిర్వహిస్తున్నాడో – అనేది దీని అర్థం. **"సర్వస్య చాహం హృదికృ సన్నివిష్టః మత్తః స్మృతిః జ్ఞానమపోహనం చ"** అని గీతలో సాక్షాత్తు శ్రీమన్నారాయణుని తో కూడిన శ్రీకృష్ణుడు పల్కిన వాక్యం. (జ్ఞానం ఉదయించే కారణమైన చోటు అయిన హృదయంలో నేను ఉన్నాను. అక్కడ కలిగే జ్ఞానం, మరుపు, స్మరణ అనేవి అన్ని నా వల్లనే కలుగుతున్నాయి). దీనివల్ల జ్ఞానాలను నిర్వహించేవాడు శ్రీమన్నారాయణుడే అనేది ఏర్పడుతున్నది. గాయత్రీ జపం భక్తి అనుష్ఠాన ప్రకారంగా ఏర్పడింది.

మూడవ వాక్యం - మొదటి రెండు వాక్యాలలో చెప్పబడిన అర్థాన్ని వివరిస్తున్నది. ఏ కార్యాన్ని అయినా "నేను చేస్తున్నాను" అనే భావంతో చేస్తే అది వ్యర్థమవుతుంది. **"అహంకారవిమూఢాత్మాత్మా కర్తాహమితి మన్యతే"** అని గీతలో - దేహాత్మాభిమానమనే అహంకారంతో వివేకాన్ని పోగొట్టుకున్న మూఢుడు "నేను ఈ కార్యాన్ని చేస్తున్నాను" అని భావిస్తాడు. దేనిని చేసినా భగవానుని అర్పణంగా చేయాలి. **"అధ్యాత్మచేతసా మయి సర్వాణి కర్మాణి సన్న్యస్య నిరాశీః నిర్మమో భూత్వా"**

అని అంటూ కర్మను చేసేవానికి ఉండదగిన స్థితిని శ్రీకృష్ణుడు గీతలో వివరించాడు. ఆత్మయొక్క యథార్థమైన జ్ఞానాన్ని కలవాడై, కర్తృత్వాన్ని నాలో నిలిపి, ఫలంలో ఆశ లేనివాడై, "ఇది నాది" అనే భావాన్ని కొంచెం కూడా లేకుండా కార్యాన్ని చేయాలి – అని భగవంతుడు చాలా స్పష్టంగా నొక్కి చెప్పాడు.

**"ఒరువనై అవనదరుళాల్ ఉఅల్ పొరుట్టు ఎన ఉణర్విన్నుళ్ళే ఇరుత్తినేన్ అదువుమ్ అవనదు ఇన్నరుళే"** అనేది ఆళ్వారుల దివ్య సూక్తి. సాటిలేని అతనిని అతని అనుగ్రహంతో పొందాలి అని నేను నా జ్ఞానానికి విషయంగా ఆ స్వామిని చేసికొన్నాను. ఆ ఆశ కూడా అతని అనుగ్రహం వల్లనే కలిగింది – అనేది దీని తాత్పర్యం. మనం దేనిని చేసినా, కోవెలకు వెళ్ళి అతని సేవించినా, ఉపహారాలను సమర్పించినా, ఆవిధంగా చేసిన అన్నీ అతనికృప వల్లనే ఏర్పడ్డాయి – అనే భావం చాలా ముఖ్యం .అతని అనుగ్రహంవల్ల అతని చెందినదానిని అతని వద్ద సమర్పిస్తున్నాము, ఆవిధంగా నాకు సమర్పించే భాగ్యం కలిగింది అని ఆనందించాలి. గాయత్రీ మంత్రాన్ని పలికి పురుషుని ధ్యానం చేసేటప్పుడు ఆ ధ్యానం అతని అనుగ్రహంవల్ల కలిగింది అనే స్పష్టమైన జ్ఞానంతో ధ్యానం చేయాలి. అప్పుడే "**ధ్యాత్వా దేవం జపేన్మనుమ్**" (భగవానుని ధ్యానించి మంత్రాన్ని జపించాలి) అనే భగవానుని ఆజ్ఞ నెరవేరినట్లు అవుతుంది.

గాయత్రీ జపంలో పురుషోత్తముడైన నారాయణుని ప్రీతితో ధ్యానించడం ముఖ్యమైన కార్యం. ఈ ధ్యానాన్ని అతడే ప్రేరేపించి నడిపిస్తున్నాడు, ఇది అతని సమర్పణం – అనే మనోభావం స్పష్టంగా ఉండాలి.

# పెరియవాచ్చాన్ పిళ్ళై వైభవం

**(తిరుపతి ఉ.వే.శ్రీమాన్ టి. ఏ. కృష్ణమాచార్యస్వామివారి తమిళవ్యాసం ఆధారంగా)**

**శ్రీమత్కృష్ణసమాహ్వాయ**
**నమో యామునసూనవే,**
**యత్కటాక్షైకలక్ష్యాణాం**
**సులభః శ్రీధరః సదా.**

ఈ శ్లోకం పెరియవాచ్చాన్ పిళ్ళై తనియన్ శ్లోకం. "శ్రీ పెరియవాచ్చాన్ పిళ్ళై 'శ్రీకృష్ణు'లనే నామం కలవారు. వీరి తండ్రి పేరు 'యామునాచార్యులవారు'. అటువంటి పెరియవాచ్చాన్ పిళ్ళై కటాక్షాన్ని పొందిన అదృష్టం కలవారికి శ్రీధరుని (వేంకటేశ్వరుని) ఆశ్రయించడానికి, దర్శించి కైంకర్యం చేసుకోవడానికి సులభం అవుతుంది. అటువంటి పెరియవాచ్చాన్ పిళ్ళైకు నమస్కరిస్తున్నాను" – అనేది ఈ శ్లోకంలోని అర్థం. ఈ శ్లోకం ఎవరు రచించారు అనే విషయం స్పష్టంగా తెలియదు. **"యత్కటాక్షణ లక్ష్యాణామ్"** అనేది ప్రాచీన పుస్తకాలలోని పాఠం. **"యత్కటాక్షైకలక్ష్యాణామ్"** అనేది కూడా ఇంకొక పాఠం. ఎవరి కటాక్షానికి ముఖ్యంగా లక్ష్యం అయినవారికి – అనేది దీని అర్థం.

**"శ్రీధరః"** – శ్రియః పతి అనే అర్థం ప్రాచీనటీకలో కనిపిస్తున్నది. వీరు సకుటుంబంగా తిరుమలకు యాత్ర వెళ్ళినప్పుడు శ్రీ వేంకటేశ్వరుడు వీరికి తన విగ్రహాన్ని ఇచ్చినట్లు వీరి చరిత్రవల్ల తెలుస్తున్నది. ఇందువల్ల వీరి ఆరాధ్య దైవం అయిన శ్రీనివాసుడే, ఇక్కడ శ్రీధరుడుగా చెప్పబడ్డాడు అని

చెప్పే అవకాశం ఉన్నందున ఆ విధంగానే ఇక్కడ అర్థం నిర్వహించబడుతున్నది. ఈ మహనీయులకు శ్రీనివాసుని విషయంలో ఉండే అభినివేశం చాలా గొప్పది అని వీరి వ్యాఖ్యానాలలో స్పష్టమవుతున్నది. **"విణ్ణకరమ్ వెక్కా విరితిరైనీర్ వేఙ్గడమ్"** (మూన్ఱామ్ తిరువందాది–62) అనే పాశురంలోని **"విరైతిరైనీర్ వేఙ్గడమ్"** అనే ప్రయోగానికి **"తిరుమలై ఎన్ఱాల్ ఒరు విశేషణరహితమాక శొల్లమాట్టార్. పరన్దు అలై ఎఱికిఱ నీర్వాళప్పమ్ పొరున్దియ ఎన్ఱు సవిశేషణమాకవే శొల్లువర్"** (తిరుమలై అంటే విశేషణం లేకుండా చెప్పరు. అలలు ఎగిసిపడే నీటి సమృద్ధిని కల అని సవిశేషణంగానే పలుకుతున్నారు) అని వీరు వివరించడం గమనించవచ్చు. పేయాళ్వారులు మూడవ తిరువందాది ప్రబంధంలోని పంతొమ్మిది పాశురాలలో తిరుమలను ప్రస్తావించారు. వాటిలో కొన్ని పాశురాలలో తిరుమలకు ఏ విశేషణం లేకుండా పలికినా, పలు పాశురాలలో వారు వేరు వేరు విశేషణాలతో చేర్చి పలకడం గమనించి తెలిసికొన్న పెరియవాచ్చాన్ పిళ్ళై, తిరుమల అంటే ఆళ్వారులు విశేషణరహితంగా చెప్పరు – అని అన్నారు. తిరుమలలో ఆళ్వారులకు ఉండే గౌరవం కంటే వ్యాఖ్యానకర్త అయిన వీరికి ఉండే అభినివేశం ఎక్కువ అని చెప్పవచ్చు. **"అడిక్కీழ் అమర్న్దు పుకున్దు అడియీర్ వాళ్ మిన్"** (తిరువాయ్ మొழி–6–10–11) అనే సూక్తిని వ్యాఖ్యానం చేస్తూ "తన పాదాలలో అనన్య ప్రయోజనంగా ఆశ్రయించి శేషత్వజ్ఞానాన్ని కలవారై ఉజ్జీవించండి– అని హస్తముద్రతో పలుకుతున్నట్లు ఉన్నది, శ్రీవేంకటేశ్వరుడు ఉండే సన్నివేశం" అని ఈ వ్యాఖ్యాత నాలాయిరప్పడి వ్యాఖ్యానంలో వివరించారు. శ్రీవేంకటేశ్వరుని శ్రీచరణాలను, అతడు వాటిని తన కుడి చేతితో చూపిస్తూ వేంచేసి ఉండడాన్ని ఎల్లప్పుడూ మనసులో భావిస్తూ ఉన్నందువల్లే కదా

ఈ వ్యాఖ్యాత ఇటువంటి సూక్తిని అనుగ్రహించారు. **"హస్తముద్రైయాల్"** అనే పదం వేరు ఏ వ్యాఖ్యానంలో లేనందున, ఈ సూక్తిని వీరికి శ్రీవేంకటేశ్వరుని విషయంలో ఉండే ఆదరానికి జ్ఞాపకంగా ఈ సూక్తిని భావించడంలో అడ్డు లేదు. ఇక్కడ ఇంకా వివరించవలసిన, ప్రస్తావించవలసిన సందర్భాలు చాలా ఉన్నా విస్తర భీతిచేత ఇంతటితో విడువబడుతున్నది. అందువల్ల పెరియవాచ్చాన్ పిళ్లై అనుగ్రహించినవారికి శ్రీ వేంకటేశ్వరుడు సులభుడు కావడం నిశ్చయం కదా.

ఇక, **"శ్రీమత్కృష్ణసమాహ్వయ"** అనే ప్రయోగానికి చెప్పే అర్థాన్ని గమనిద్దాం. **"శ్రీమత్ కృష్ణః ఇతి సమాహ్వ యస్య సః"** అని పూర్వం టీకలో తెలుపబడిన వివరణం కాకుండా, **"శ్రీమత్ కృష్ణస్య సమాహ్వ సమీచీనా ఆహ్వ యస్య సః"** అనే విగ్రహంతో శ్రీమత్ కృష్ణుడనే సత్యమైన, వాస్తవమైన పేరును కలిగినవారు అనే అర్థాన్ని గ్రహించి శ్రీకృష్ణ పరమాత్మకు కల గొప్ప పేరు అయిన మహాచార్యుడు అనే పేరును కలవారు ఈ యామునాచార్య పుత్రులు అనే అర్థాన్ని చెప్పవచ్చు. శ్రీకృష్ణుడనే పేరుకు – అసురులను చంపి భూమి భారాన్ని తీర్చి, భూదేవికి సుఖాన్ని కలిగించేవాడు అని అర్థం. ఆ పేరు కంటే అతనికి ఏర్పడిన మహాచార్యుడు అనే పేరే చాలా గొప్పది. **"అకల ఇఞానత్తవర్ అఱియ నెఱియెల్లామెడుత్తురైత్త నిఱైఇఞానత్తొరుమూర్ త్తి"** (తిరువాయ్ మొళి–4–8–6) అని నమ్మాళ్వార్ లు కలిపిన రీతిలో గీతోపదేశం చేసినందున ఏర్పడిన మహాచార్యశబ్దం భూదేవికి భారం తీర్చినందున కలిగిన కృష్ణనామం కంటే చాలా గొప్పది కదా. శ్రీవరాహచరమ శ్లోకం, శ్రీరామచరమ శ్లోకం అనే రెండు చరమశ్లోకాలను అనుగ్రహించి ఆచార్య పదాన్ని నిర్వహించే శ్రీ వరాహ పెరుమాళ్ కంటే, శ్రీరామచంద్రుని కంటే **'గీతోపనిషత్'** అని పేరు పొందిన 700 శ్లోకాలను కల చాలా గొప్ప శాస్త్రాన్ని అనుగ్రహించి

మహాచార్యపదాన్ని నిర్వహించే శ్రీకృష్ణుడే కదా గొప్పవాడు. అతని పేర్లలో అసురులను వధించిన శక్తిచేత పొందిన కృష్ణుడనే నామం కంటే శాస్త్రాన్ని అంతటినీ ఉపదేశం చేసిన సంపూర్ణ జ్ఞానంతో పొందిన మహాచార్యుడు అనే నామం కదా చాలా గొప్పతనాన్ని కలిగినది. గీతాచార్యునకు ఆచార్యత్వం చెబితే చాలదా? మహాచార్యత్వం చెప్పాలా? అని అంటే, మహాచార్యత్వం లోకంలో ప్రసిద్ధమైనందున దానిని కప్పిపుచ్చడానికి గాని కాదనడానికి గాని ఎవరికీ సాధ్యం కాదు. వరాహాచార్యులు, కూర్మాచార్యులు, వామనాచార్యులు అని కేవలం ఆచార్య శబ్దంతో చేర్చి వ్యవహరించే లోకం కృష్ణనామాన్ని కలిగినవారిని చెప్పేటప్పుడు కృష్ణమాచార్యులు అని మహాచార్యశబ్దంతో చేర్చే నిర్దేశించడం లోకంలో సుప్రసిద్ధం. కనుక కృష్ణుడే మహాచార్యుడు. కృష్ణమాచార్యులు అంటే కృష్ణమహాచార్యులు అని అర్థం. ఇప్పటికీ ఉత్తర దేశంలో ఉండే వారు కృష్ణమహాచార్యులు అని వ్యవహరించడం గమనించవచ్చు. ఇంతే గాక, శరీరమే ఆత్మ అని భ్రమించి, నేను యుద్ధం చేయను – అని యుద్ధం నుండి వెనుకకు తగ్గిన అర్జునునకు "శరీరం అచేతనం, ఆత్మ చేతనం. నశించే శరీరం కంటే నశించని ఆత్మ విభిన్నమైనది. యుద్ధంలో నీచేత చంపబడేది ఆత్మ కాదు. శరీరమే. నీ ఎదురుగా ఉండే వీరి శరీరాన్ని నీవు ఇప్పుడు వధించకపోయినా ఏనాటికైనా ఒక నాడు అది తప్పక నశిస్తుంది. దానిని గర్చి జ్ఞానులు కలత చెందరు. ఆత్మ ఈ శరీరాన్ని విడిచినట్లయితే వేరొక శరీరాన్ని పొంది తీరుతుంది. అందువల్ల మీ పాపుల శరీరాన్ని లేకుండా చేయడంకోసం అయినా నీవు యుద్ధం చేయడం అవసరం" అని ఈ విధంగా అతనికి చెప్పవలసిన తత్త్వవివేకం, ఆత్మనిత్యత్వ, శరీరానిత్యత్వాదులను మాత్రం ఒకటి రెండు శ్లోకాలతో తెలియజేస్తే సరిపోయి ఉండగా, ఆ విధంగా కాకుండా, యుద్ధంలో చాలా వివరంగా ఈ గీతాశాస్త్రాన్ని పూర్తిగా ఉపదేశించడం

మహాచార్యత్వం వల్లనేకదా. భగవద్రామానుజులవలె పూర్ణమైన కరుణను కలిగి ఉండడం కదా మహాచార్యత్వానికి సూచకం. పండితులతో, పామరులతో తేడా లేకుండా కృష్ణ నామం కలిగినవారిని అందరిని కృష్ణమాచార్యులు అని వ్యవహరించడం శ్రీకృష్ణునకు కల అ మహాచార్యత్వాన్ని అనుసరించే కదా. **"ఇమ్మాయమ్ వల్ల నహపిళ్ళై నంబ"** (పెరియాళ్వార్ తిరుమొళి–3–1–3) అనే విధంగా శ్రీ కృష్ణుడు బాల్యంతో నిండినవాడైనందున శ్రీకృష్ణుడు కూడా పిళ్ళై అనబడుతున్నాడు. అందువల్ల వసుదేవ పుత్రునకు కృష్ణుడు, మహాచార్యుడు, పిళ్ళై అని మూడు పేర్లు ఉన్నట్లు గమనించాము. **"శ్రీమత్ కృష్ణేన సహ సమాః ఆహ్వాః యస్య సః"** అనే విగ్రహం చెప్పి, కృష్ణునితో సమానమైన పైన తెలిపిన మూడు పేర్లను కలిగినవారు, ఈ ఆచార్యులు అనే అర్థాన్ని కూడా ఇక్కడ చెప్పవచ్చు. ఇక పెరియ వాచ్చాన్ పిళ్ళై ఈ మూడు నామాలను కలిగి ఉండడంలో ఉండే సామంజస్యాన్ని గమనిద్దాం.

ఈ మహాచార్యులు 'ఆవణి' మాసం రోహిణి నక్షత్రంలో కృష్ణునివలే అవతరించారు. అందువల్ల వీరికి వీరి తండ్రి యామునాచార్యులవారు కృష్ణుడనే అనే నామాన్ని పెట్టారు. కనుక వీరు కృష్ణుడు అయ్యారు. తనియన్ శ్లోకం కూడా **"శ్రీమత్ కృష్ణ సమాహ్వాయ"** అని దీనిని తెలుపుతున్నది. పలువిధాలైన గ్రంథాలను అనుగ్రహించి నందున లోకంలోని వారికి దైవసంపత్తును పెంచి అసుర సంపత్తును పోగొట్టి, భూమి భారాన్ని పోగొట్టి, సుఖాన్ని కలిగించినందున కూడా కృష్ణశబ్దంలోని అవయవార్థం వీరి విషయంలో సమన్వయించడం గమనించదగినది. ఆళ్వారులు అనుగ్రహించిన నాలాయిరానికి తేనె, పాలు, కలకండ, అమృతం వంటి వ్యాఖ్యానాలను రచించినందున, రామాయణ తనిశ్లోకం, భారతాది తనిశ్లోకం, ఋగ్వేద ఖిలమైన జితంతే స్తోత్రానికి వ్యాఖ్యానం, స్తోత్రరత్నం,

చతుఃశ్లోకి, గద్యత్రయాలకు వ్యాఖ్యానాలను రచించినందున శ్రీకృష్ణునకు ఉండే మహాచార్యుడు అనే పేరు వీరికి చాలా తగినది. మహాచార్య శబ్దమే పెరియవాచ్చాన్ అని ద్రావిడనామంగా మారి వీరిని నిర్దేశించడం గమనించాలి. పిళ్ళై అనే పదానికి శ్రీకృష్ణుని విషయంలోవలె వీరి ఈ విషయంలో బాల్యం కారణంగా కాకుండా లోకాచార్యులైన నంబిళ్ళై వీరిని జ్ఞానపుత్రులుగా అభిమానించి వీరిని "**పిళ్ళాయ్**" అని పిలిచినందున, వీరికి ఈనామం యుక్త మైనది.

ఇక, వీరికి తగిన, ప్రత్యేకమైన గొప్పతనాలను కొన్నింటిని గమనిద్దాం. "**పిళ్ళాన్ నంజీయర్ పెరియ వాచ్చాన్ పిళ్ళై తెళ్ళార్ వడక్కు త్తిరువీదిప్పిళ్ళై మణవాళయోగి తిరువాయ్ మొళియై క్కాట్ర గుణవాళరెన్ఱు నెంజే! కూఱు**" అని వరవరములు 'తిరువాయ్ మొళి' ప్రబంధానికి వ్యాఖ్యానాన్ని రచించి రక్షించిన గొప్పతనాన్ని కలిగినవారుగా పూర్వాచార్యులను ఐదుగురిని నిర్దేశించారు. వీరు అందరూ చాలా గొప్పతనాన్ని కలిగినవారే అయినా, ఈ ఈ పీళ్ళైకు ఉండే ప్రత్యేకత సాటి మేటి లేనిది.

మణవాళ యోగి అనే అళకియ మణవాళచ్చీయర్, తమ ఆచార్యుల అజ్ఞతోగాని, అనుమతితో కానీ కాకుండా లోకులపై ఉండే ప్రీతితో మాత్రమే పన్నీరాయిరప్పడి అనే వ్యాఖ్యానాన్ని 'తిరువాయ్ మొళి' ప్రబంధానికి రచించారు. వడక్కు త్తిరువీదిప్పిళ్ళై నంబిళ్ళై ఉపన్యాసాన్ని ఈడు ముప్పత్తాఱాయిరప్పడి వ్యాఖ్యగా రచించారు. తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళాన్, నంజీయర్ అనే ఇద్దరు భగవద్రామానుజుల అనుగ్రహాన్ని, భట్టర్ అనుగ్రహాన్ని ప్రార్థించి పొంది, వారి అనుమతితో ఆఱాయిరప్పడి, ఒన్పదినాయిరప్పడి అనే వ్యాఖ్యానాలను 'తిరువాయ్ మొళి' ప్రబంధానికి రచించారు.

ఇక పెరియవాచ్చాన్ పిళ్ళై ఇరుపత్తునాలాయిరప్పడి అనే వ్యాఖ్యను రచించిన వైనాన్ని గమనిద్దాం.

**"నంబిళ్ళై తమ్మృడైయ నల్లరుళాల్ ఏవి యిడ ప్పిన్ పెరియవాచ్చాన్ పిళ్ళై యదనాల్ ఇన్బా వరుపత్తి మాఅన్ మఱైప్పొరుళై చ్చొన్నదు ఇరుపత్తు నాలాయిరమ్"** అని శ్రీవరవరమునులు 'ఉపదేశ రత్నమాల' ప్రబంధంలో పలికిన సూక్తిని కొంచెం వివరంగా చూద్దాం. నంబిళ్ళై తమ చల్లని కరుణతో 'తిరువాయ్ మొళ్ళి' ప్రబంధానికి ఒక చక్కని వ్యాఖ్యానాన్ని రచించండి అని నియమించగా, ఆచార్యుల ఆ ఆజ్ఞను శిరసా వహించి, నిరతిశయసుఖరూపమైన భక్తిని కలవారు, ఆప్తులు అయిన నమ్మాళ్వార్లు తమకు గల ఆ భక్తి ప్రభావం చేత అనుగ్రహించిన ద్రవిడవేదరూపమైన 'తిరువాయ్ మొళ్ళి' ప్రబంధంలోని అర్థాన్ని ఇరుపత్తు నాలాయిరప్పడి అనే వ్యాఖ్యానంగా రచించారు–అనేది ఈ పాశుర భావం.

ఇందులో **"ఏవి యిడ పిన్ శొన్నదు"** అని అన్నందున, ఆచార్యులు అజ్ఞాపించిన తరువాతే వ్యాఖ్యానం చేశారు – అనే విషయం, **"అదనాల్ శొన్నదు"** అని అన్నందున వ్యాఖ్యానించడానికి ఆచార్యుల ఆజ్ఞ కారణం అని తెలుస్తున్నది. **"అదనాల్"** అనే పదంవల్ల ఆచార్యుల ఆజ్ఞ లేకుండా స్వతంత్రంగా వ్యాఖ్యానాన్ని చేసిన నడువిల్ తిరువీదిప్పిళ్ళై భట్టర్, వడక్కు త్తిరువీదిప్పిళ్ళై వ్యావర్తింపబడ్డారు" – అనే పిళ్ళైలోకంజీయర్ సూక్తి స్మరణీయం. దీనివల్ల తామే స్వయంగా వ్యాఖ్యానం రచించిన వాది కేసరి అళకియ మణవాళ జీయర్, వడక్కు త్తిరువీదిప్పిళ్ళై, ఆచార్యుల అనుమతిని ప్రార్థించి పొంది వ్యాఖ్యను రచించిన పిళ్ళాన్, నంజీయర్ అనే ఈ నలుగురిని కంటే ఏ స్వాతంత్ర్యగంధం లేకుండా, ఆచార్యపారతంత్ర్యాన్ని పూర్తిగా కలిగి ఉండడమనే వైలక్షణ్యం ప్రస్ఫుటం అవుతుంది.

నంబిళ్ళై తమకు ప్రియశిష్యులు, తమ దగ్గర అన్ని విషయాలను స్పష్టంగా అభ్యసించిన పెరియవాచ్చాన్ పిళ్ళైను "తిరువాయ్ మొళ్ళి ప్రబంధానికి ఒక వ్యాఖ్యానాన్ని రచించండి" అని ఆజ్ఞాపించగా, పెరియవాచ్చాన్ పిళ్ళై కూడా శ్రీ రామాయణ శ్లోకసంఖ్యలో ఒక వ్యాఖ్యానాన్ని రచించారు – అని ఆఱాయిరప్పడి గురుపరంపరాప్రభావంలోని సూక్తిని కూడా స్మరించాలి.

ఈ విధంగా తిరువాయ్ మొళ్ళి ప్రబంధానికి మాత్రమే కాకుండా మిగిలిన ఆళ్వారుల ప్రబంధాల కూడా వ్యాఖ్యానాన్ని అనుగ్రహించిన గొప్పతనం వీరికి ఒక్కరికే ఉన్నది. ఈ విషయం **"పెరియవాచ్చాన్ పిళ్ళై పిన్బుళ్ళవైక్కుమ్"** అనే పాశురంలో ఈ విషయాన్ని శ్రీవరవరములు ఉపదేశరత్నమాల ప్రబంధంలో తెలిపారు. "నమ్మాళ్వారుల ప్రబంధమైన 'తిరువాయ్ మొళ్ళి'కే కాకుండా తిరుప్పల్లాండు నుండి తిరుమడల్ వరకు ఉండే 23 దివ్య ప్రబంధాలుకు వ్యాఖ్యానాలను రచించినందున అర్థం తెలుసుకోవడానికి కష్టంగా ఉండే ఈ ప్రబంధాల అర్థాన్ని, తరువాతి కాలంలోని ఆచార్యులకు చక్కగా తెలుసుకోవడానికి వీలు అవుతున్నది. ఇతరులకు ఉపదేశించడానికి కూడా వీలు అవుతున్నది" – అనేది ఈ పాశురంలోని భావం. "మిగిలిన ఆచార్యుల కంటే వీరికి గల గొప్పతనం ఇదే కదా" అనే పిళ్ళైలోకంజీయర్ సూక్తిని ఇక్కడ స్మరించాలి.

# ఆచార్యవాన్ పురుషో వేద

**(న్యాయవేదాంత విద్వాన్**
**ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారు, నరసాపురం**
**అనుగ్రహించిన వ్యాసం)**

లోకంలో జన్మించిన ప్రతి ప్రాణి సుఖంగా జీవించాలని కోరుకుంటాడు. "**సర్వస్య సుఖమీప్సితమ్**" – ప్రతివాడు సుఖాన్ని కోరుకుంటాడు– అనేది లోకసూక్తి. అయితే, ఈ సుఖం - దుఃఖంతో కూడినది, దుఃఖ సంబంధం లేనిది –అని రెండు విధాలుగా ఉంటుంది. ఈ లోకంలో కోరుకున్న ఫలాన్ని పొంది ఆనందించడానికి వీలుగా, వేద పురుషుడు వేలాది తల్లిదండ్రుల కంటే ఎక్కువ వాత్సల్యం కలిగినవాడు కనుక, అనేక ఉపాయాలను విధించాడు. ముందుగా, ప్రతి వ్యక్తి శత్రునిరసననం, అంటే, శత్రుసంహారం. దీనికోసం వేదం "**శ్యేనయా ఆభిచరన్**" అని శ్యేనయాగం మొదలైన అభిచార క్రియలను విధించింది. స్వర్గలోకంలో పొందే ఆనందానికి జ్యోతిష్టోమయాగం మొదలైన యాగాలను తెలిపింది. ఈ లోకంలో కానీ, లేక, స్వర్గాది పరలోకాలలో కానీ పొందబడే సుఖాలన్నీ దుఃఖంతో కలసిన సుఖాలే. అవి అన్నీ పరిపూర్ణమైన సుఖాలు కావు. "స్వర్గలోకంలో ఉండేవాడు కూడా పూర్ణమైన ఆనందాన్ని అనుభవించడం లేదు. తన పుణ్యం క్రమంగా తరిగిపోతున్నదే! అనే దుఃఖం అతనికి కలుగుతుంది" అనే విషయాన్ని "**స్వర్గే పి పాతభీతస్య క్షయిష్ణోః నాస్తి నిర్వృతిః**" అనే సూక్తి తెలుపుతున్నది. అందువల్ల స్వర్గలోక సుఖాలు నిజమైన సుఖాలు కావు. దుఃఖంతో కలసినవే.

దుఃఖస్పర్శ ఏమాత్రం లేని ఆనందం పరమాత్మప్రాప్తి వల్లనే కలుగుతుంది. పరమాత్మ ఆనందస్వరూపుడు కదా. ఈ పరమాత్మప్రాప్తి బ్రహ్మజ్ఞానం వల్లనే కలుగుతుంది. "బ్రహ్మవిత్ ఆప్నోతి పరమ్" అని ఉపనిషత్తు ఈ విషయాన్ని చెప్పింది. అందువల్ల అనిత్యమైన ఈ లోకంలో ఉండే సుఖాలన్నీ అనిత్యాలు అని గమనించినవాడు బ్రహ్మజ్ఞానం కోసం ప్రయత్నం చెయ్యాలి. **"అస్తి బ్రహ్మేతి చేత్ వేద సంత మేనం తతో విదుః"** అని వేదం - బ్రహ్మం ఉన్నదని తెలిసికొన్నవాడు ఎవడో అతడే అస్తిత్వాన్ని కలిగినవాడగా పెద్దలు తెలిసి కొంటున్నారు–అని తెలిపింది. అంతే కాదు. ఆ బ్రహ్మ జ్ఞానం కలవానిని "**ఏనమ్**" అని సమీపంలో ఉన్నవానిని తెలిపే సర్వనామశబ్దాన్ని ప్రయోగిస్తూ ఆదరంతో పలికింది. అయితే, ఇక్కడ ఒక విషయం జాగ్రత్తగా గమనించాలి. బ్రహ్మం ఉన్నదని తెలియడం మాత్రమే కాదు, బ్రహ్మం ఉన్నదని తెలిసినట్లే, ఆ పరమాత్మకు గుణాలున్నాయి, రూపం ఉన్నది, విభూతి ఉన్నది, లీలలు ఉన్నాయి అని కూడా తెలియాలి. అప్పుడే అస్తిత్వాన్ని కలవాడు కాగలడు. దీనికి మారుగా "**అసన్నేవ స భవతి అసత్ బ్రహ్మేతి వేద చేత్**" అని కూడా వేదం అన్నది. బ్రహ్మం లేదని భావించేవాడు అస్తిత్వాన్ని లేని వాడే అవుతాడు– అని దీని అర్థం. వీటిని బట్టి మనకు తేలినది ఏమంటే, బ్రహ్మ జ్ఞానం తరించడానికి కారణమని.

"**ముక్తిః మోక్షో మహానందః**" అని మోక్షమనే ముక్తి , అంటే, శరీర సంబంధం తీరి పోవడం, పరమానందం పొందడం అని రెండు విధాలుగా నిర్వచింపబడుతున్నది. శరీర సంబంధ రూపమైన అనిష్టం తీరాలన్నా, మహానందం పొందాలి అని అన్నా తత్వజ్ఞానం పొందాలి. "**తరతి శోకమ్ ఆత్మవిత్**"– పరమాత్మను తెలిసినవాడు శోకాన్ని పోగొట్టుకుంటున్నాడు– అనే సూక్తి వల్ల ప్రకృతిసంబంధ రూపమైన అనిష్టం బ్రహ్మజ్ఞాన ప్రాప్తివల్ల ఏర్పడుతుందని తెలుస్తున్నది. ఆ విధంగానే,

**"బ్రహ్మవిత్ ఆప్నోతి పరమ్"** బ్రహ్మ జ్ఞానం కలవాడు పరమాత్మను పొందుతున్నాడు– అనే ఇంకొక వాక్యం మహానంద రూపుడైన పరమాత్మను పొందడమనే ఇష్ట ప్రాప్తి కూడా బ్రహ్మజ్ఞానం వల్లనే కలుగుతుందని తెలుపుతున్నది.

ఇటువంటి పరమాత్మను పొందడం అనే పరమ పురుషార్థం పొందడం ఎలా? అనే విచారణను తెలివి కలిగినవాడు, ముముక్షువు అయిన ప్రతివాడు చేయాలి. ఈ లోకంలోని సుఖాలు - సుఖాలు కావు. శాశ్వతంగా నిలువవు. దుఃఖంతో నిండినవి. నిత్యమైనది, ఆనందరూపమైనది అయిన మోక్షం పరమాత్మను పొందడంవల్లనే ఏర్పడుతుంది . ఆ పరమాత్మ ప్రాప్తిని ఏ విధంగా పొందాలి? అని ఆలోచించాలి. దీనికి సదాచార్యుని వల్ల బ్రహ్మజ్ఞానాన్ని పొందాలని వేదం బదులు తెలుపుతున్నది. **"పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేద మాయాత్, తద్విజ్ఞానార్థం స గురు మేవ అభిగచ్ఛేత్"** అనే వాక్యం ఈ విషయాన్ని తెలియజేస్తుంది. దీనినిబట్టి దుఃఖాన్ని పోగొట్టుకోవాలి అని అన్నా, పరమానందాన్ని పొందాలని అన్నా సదాచార్య సన్నిధిలో తత్వజ్ఞానాన్ని పొందడమే సరియైన ఉపాయం. ఇదే వైదిక సంప్రదాయం– అని స్పష్టపడుతున్నది. ఈ విధంగా తన దగ్గరకు వచ్చిన, ఆసక్తి కలిగిన, ప్రశాంతమైన మనసు కలిగిన శిష్యునకు తత్వ విద్యను ఆచార్యుడు యథాతథంగా బోధించాలి అనే సంగతిని **"తస్మై ప్రసన్నాయ ప్రశాంత చిత్తాయ ప్రోవాచ తత్త్వతో బ్రహ్మవిద్యామ్"** అనే శ్రుతి తెలుపుతున్నది.

ఇక, ఇప్పుడు సదాచార్యుడు ఎవరు? అనే సంగతిని గమనించాలి. ఆచార్యులు మనకు మూడు విధాలుగా కనిపిస్తారు. కన్నతండ్రి ఒక ఆచార్యుడు, భగవంతుడు ఇంకొక ఆచార్యుడు,

అష్టాక్షరీ మహామంత్రం ఉపదేశించినవాడు మరి ఒక ఆచార్యుడు. వీరిలో ఉండే తేడాలను గమనిద్దాం.

తండ్రి ఒక ఆచార్యుడు అనే విషయం మనకు ఉపనయన సంస్కారంలోని ఒక సందర్భం వల్ల తెలుస్తుంది. ప్రధాన హోమంలో కొన్ని హోమాలు **"ఆచార్యో జుహుయాత్"** అని చెప్పబడ్డాయి. ఇక్కడ 'ఆచార్య'శబ్దం గాయత్రీ మంత్రాన్ని ఉపదేశించిన కన్నతండ్రిని తెలుపుతుంది. అయితే, తండ్రి అనే ఈ ఆచార్యుడు సదాచార్యుడు అని చెప్పలేము. ఎందుకంటే, **"పెఱ్ఱార్ పెఱ్ఱోళిన్దార్"** అనే విధంగా కొంతమంది తండ్రులు తాము కన్న బిడ్డలను కూడా రక్షించకుండా విడచి పెడతారు. దీనికి కాకాసుర వృత్తాంతం ఒక ఉదాహరణ. జగన్మాత అయిన సీతాదేవి విషయంలో అపచారం చేసిన కాకాసురునిపై రాముడు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. దానికి భయపడి తన ప్రాణ రక్షణకోసం కాకాసురుడు తన తండ్రి అయిన ఇంద్రుడి దగ్గరకు వెళ్ళాడు. కానీ, ఇంద్రుడు అతని విడిచిపెట్టాడు. ఈ విషయం రామాయణంలోని **"స పిత్రా చ పరిత్యక్తః"** అనే వచనం స్పష్టం చేస్తున్నది. ఇంతే కాదు, లోకంలో తండ్రి తన లాభాన్ని ఆశించి కన్న కొడుకును అమ్మిన సందర్భాలు కూడా ఉన్నాయి. రామాయణంలోని శునశ్శేఫ వృత్తాంతం దీనికి ఒక ఉదాహరణ. ఋచీకుని కుమారుడైన శునశ్శేఫునిని అతని తండ్రి అంబరీషునకు అమ్మిన కథ ఇది. ఇటువంటివి ఇంకా ఎన్నో ఉన్నాయి. ఇందువల్ల కన్నతండ్రి తన సంతానాన్ని తప్పక రక్షిస్తాడు– అని చెప్పలేము.

ఇక రెండవ తండ్రి అయిన భగవంతుని విషయం గమనిద్దాం. లోకంలో మనకు కల తండ్రితో సంబంధం ఆ జన్మ వరకే పరిమితం. కానీ, భగవంతుడనే తండ్రితో మనకు గల సంబంధం నిత్యమైనది. **"భూతానాం యోవ్యయః పితా"**, అని

"**ఎన్నుమ్ ఇఅవాద ఎంద్రై**" అనే సూక్తులు ఈ విషయాన్ని తెలుపుతున్నాయి. ఇటువంటి నిత్యమైన తండ్రి అయిన భగవంతుడు ఆచార్యుడు అనే విషయం "**యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై**"– (ఎవడు సృష్టి ఆరంభంలో బ్రహ్మను సృష్టిస్తున్నాడో, ఆ బ్రహ్మకు వేదాలను ఉపదేశిస్తున్నాడో) అనే సూక్తి ఆ విధంగానే , "**ఎయిఱ్ఱిల్ మణ్ కొండ ఎంద్రై ఇరాప్పకల్ ఓదువిత్తు**" (తన దంతంతో భూమిని ఉద్ధరించిన తండ్రి రాత్రి పగలు ఉపదేశించి) అనే సూక్తి– ఈ విధంగా ఎన్నో ఎన్నో సూక్తులు భగవంతుని ఆచార్యత్వాన్ని తెలుపుతున్నాయి. లోకంలో తండ్రి అనే ఆచార్యుడు రక్షించకుండా విడిచిపెట్టినట్లు భగవంతుడు విడిచిపెట్టడు. పాపం చేసిన ఒకనిని తాత్కాలికంగా కోపించినా , తరువాత అతనిలో కలిగిన పశ్చాత్తాపాన్ని చూచి క్షమిస్తాడు. అందువల్ల లోకంలో తండ్రి అనే ఆచార్యుని కంటే భగవంతుడనే ఆచార్యుడు విలక్షణుడు.

భగవంతుడనే ఈ ఆచార్యుడు కూడా అన్ని సమయాలలోనూ రక్షిస్తాడని చెప్పలేము. భగవంతుడు "**సంసార బంధస్థితి మోక్ష హేతుః**" అని చెప్పినట్లు సంసారానికి, ఆ విధంగానే, మోక్షానికి కారణమవుతాడు. పాపాలను చేసిన వారిని "**న క్షమామి**" క్షమించను, "**క్షిపామి**" నరకంలోకి తోసివేస్తాను– అని నిగ్రహాన్ని చూపిస్తాడు. ఇంతే కాదు, ఇతడు సన్నిహితుడు కూడా కాదు. వేదం "**న మాంసచక్షుభి రభివీక్షతే తమ్**" పరమాత్మను ఈ భౌతిక నేత్రాలతో దర్శించలేమని అన్నది. ఇందువల్ల పరమాత్మ అనే ఆచార్యునిలో కూడా కొన్ని దోషాలు ఉన్నాయని చెప్పాలి.

ఇటువంటి దోషాలు ఏమీ లేనివారు సదాచార్యులు. ఇటువంటి సదాచార్య సంబంధాన్ని కలవాడే బ్రహ్మజ్ఞానాన్ని

యథాతథంగా పొందగలడు. ఈ అర్థం "ఆచార్యవాన్ పురుషో వేద" అనే సూక్తిని అవధారణ గర్భంగా అన్వయించడం ద్వారా వస్తుంది. అంటే, సదాచార్యుని కలవాడే బ్రహ్మజ్ఞానాన్ని పొందగలడు, పరమాత్మను పొందగలడు–అని అర్థం. ఈ అర్థం **"అసతి బాధకే సర్వం వాక్యం సావధారణమ్"** అనే న్యాయాన్ని బట్టి వస్తుంది. సదాచార్యులు **"శిఱుమామనిశరాయ్ ఎన్నై యాణ్డార్ ఇజ్గే తిరియవే"** అని మన ముందే సంచరిస్తూ, మన భౌతిక నేత్రాలతో దర్శించడానికి వీలుగా ఉంటారు. అందువల్ల భగవంతునిలో ఉండే దుర్లభత్వం అనే దోషం వీరిలో లేదు. ఇంతే కాదు. సదాచార్యులు సదా కరుణా స్వభావులు. వారు ఏ నాడు నిగ్రహాన్ని చూపరు. అందుచేత భగవంతుడు నిగ్రహాన్ని చూపినట్టుగా వీరు కూడా నిగ్రహాన్ని చూపిస్తారేమో అనే సందేహానికి అవకాశం లేదు. ఈ విధంగా సదాచార్యుడు భగవంతుడనే ఆచార్యుని కంటే విలక్షణుడు కదా. కనుకనే **"గరీయాన్ బ్రహ్మదః పితా"** – బ్రహ్మజ్ఞానాన్ని ఉపదేశించినవాడే గొప్ప తండ్రి. **"ఆచార్యవాన్ పురుషో వేద"** అనే సూక్తి కూడా సదాచార్యుని కలవాడే పరమాత్మను తెలిసి కొంటున్నాడు అని తెలుపుతున్నది.

లోకంలో ఒకడు తరించడానికి అతడు చేసిన పుణ్యం కారణం కాదు. ఒకడు బాగుపడడానికి అతడు చేసిన పాపం కూడా అడ్డు కాదు. ఆచార్య సంబంధం ఉంటే పుణ్యంతో పని లేదు. పాపం అడ్డు రాదు. ఈ రెండు ప్రయోజకాలు కావు. ఈ విషయాన్ని **"పాపిష్ఠః క్షత్రబంధుశ్చ పుండరీకశ్చ పుణ్యకృత్, ఆచార్యవత్తయా ముక్తౌ. తస్మాత్ ఆచార్యవాన్ భవేత్"** – (ఎన్నో పాపాలను చేసిన క్షత్ర బంధువు, ఆ విధంగానే, పుణ్యం చేసిన పుండరీకుడు– అనే ఇద్దరు ఆచార్య సంబంధం వల్ల తరించారు. అందుచేత సదాచార్య సంబంధం కలవాడు కావాలి)– అనే ప్రసిద్ధమైన వచనం స్పష్టం చేస్తున్నది.

అయితే, సదాచార్యుడు ఎవరు? అనే విషయానికి పలు ప్రమాణాలు ఉన్నాయి. "**ఆచార్యో వేదసంపన్నో విష్ణుభక్తో విమత్సరః, మంత్రజ్ఞో మంత్రభక్తశ్చ సదా మంత్రాశ్రయః శుచిః, గురుభక్తి సమాయుక్తః పురాణజ్ఞో విశేషతః, ఏవం లక్షణసంపన్నో గురురిత్యభిధీయతే**" (ఆచార్యుడు అనేవాడు వేదాలను తెలిసినవాడు. విష్ణు భక్తిని కలవాడు, అసూయ లేనివాడు, అష్టాక్షరీ మంత్రాన్ని తెలిసినవాడు, అందులో భక్తి కలవాడు, దానిని ఎల్లప్పుడూ మననం చేసేవాడు, మనసులో, శరీరంలో పవిత్రత కలవాడు, గురుభక్తి కలవాడు, విశేషంగా పురాణాలను తెలిసినవాడు అయి ఉండాలి) అనేది ఒక ప్రసిద్ధ ప్రమాణం. క్లుప్తంగా చెప్పాలంటే, అష్టాక్షరిని ఉపదేశించివాడు సదాచార్యుడు– అని చెప్పవచ్చు. ఈ విషయాన్ని పిళ్ళై లోకాచార్యులవారు ముముక్షుప్పడి అనే గ్రంథంలో తిరుమంత్రాన్ని ఉపదేశించినవాడే సదాచార్యుడు అని తెలిపారు. ఇందువల్ల తిరుమంత్ర జ్ఞానమే యథార్థ జ్ఞానమని ఏర్పడుతున్నది. అష్టాక్షరివల్ల మనకు "శ్రీమన్నారాయణుని విషయంగా కలిగిన జ్ఞానం ఏదో అదే నిజమైన జ్ఞానం. ఆ విధంగా కానిది నిజమైన జ్ఞానం కాదు" అని కూడా తెలుస్తున్నది. దీనిని కూడా పిళ్ళైలోకాచార్యులవారు ముముక్షుప్పడిగ్రంథంలో తెలిపారు.

ఈ జ్ఞానాన్ని తెలిపినవారే సదాచార్యులు. ఈ జ్ఞానం పరస్వరూపం, జీవ స్వరూపం, ఉపాయ స్వరూపం, ఉపేయస్వరూపం, విరోధి స్వరూపం అని ఐదు విధాలుగా ఉంటుంది. దీనికే అర్థపంచకజ్ఞానం అని పేరు. దీనినే సకల వేదాలు, వేదాంగాలు, ఇతిహాసాలు, పురాణాలు, ధర్మ శాస్త్రాలు, ఇంకా మిగిలినవి అన్నీ బోధిస్తున్నాయి. ఈ జ్ఞానమే తత్వం, హితం, పురుషార్థం అని మూడు విధాలుగా విభాగించి చెప్పబడుతున్నది కూడా. తత్వంలోకి పర స్వరూపం, జీవ

స్వరూపం, విరోధి స్వరూపం అంతర్భవిస్తాయి. ఈ జ్ఞానం కంటే వేరైనది అజ్ఞానం అని చెప్పబడుతున్నది. శ్రీవిష్ణు పురాణం కూడా **"తత్ జ్ఞానం అజ్ఞానం అతః అన్యదుక్తమ్"** అని అన్నది. ఈ విధంగా "పరమాత్మ మనకు స్వామి, ఆ స్వామికి మనం శేషం ఆయనే ఉపాయం. ఆయన కైంకర్యమే పురుషార్థం" అని తెలిసినవాడు ప్రపన్నుడు అనబడతాడు. ఇటువంటి జ్ఞానప్రాప్తి నేరుగా ఆచార్యుని ఆశ్రయించడం వల్ల లభిస్తుంది తప్ప, కేవల పుస్తక పఠనం వల్ల, స్వయం ప్రయత్నం వల్ల ఎంతటివానికైనా కలుగదు అనేది సిద్ధం. ఆచార్యానుగ్రహం వల్ల ఆచార్యుని వద్ద అధ్యయనం చేసిన విషయమే కాక, చేయని రహస్యాలు కూడా అవగతం అవుతాయి–అని శ్వేతాశ్వతరోపనిషత్తులోని **"యస్య దేవే పరా భక్తిః యథాదేవే తథా గురౌ, తస్యైతే కథితాహ్యర్థా ప్రకాశంతే మహాత్మనః"** అనే మంత్రం చెబుతున్నది.

మోక్షం అనే ఈ పరమ పురుషార్థాన్ని ఇచ్చేవాడు భగవంతుడు. ఆ స్వామి సదాచార్య సంబంధం లేనిదే ఆ పురుషార్థాన్ని అనుగ్రహించడు. ఈ సంగతి బహుప్రమాణసిద్ధం. శ్రీవరవరమునుల ఉపదేశ రత్నమాల ప్రబంధంలోని **"ఞానమనుట్టానమివై నన్లాకవే యుడైయనాన కురువై అడైన్దక్కాల్ మానిలత్తీర్ తేనార్ కమలత్తిరుమామకళ్ కొழునన్ తానే వైకుందమ్ తరుమ్"** (ఓ జనులారా! జ్ఞానం, అనుష్ఠానం అని ఈ రెండిటిని చక్కగా కలిగిన ఆచార్యుని ఆశ్రయిస్తే లక్ష్మీపతి స్వయంగా మోక్షాన్ని ఇస్తాడు) అనే పాశురం ఒక ప్రమాణం.

ఈ విషయంలో చాలా ఐతిహ్యాలుకూడా కనిపిస్తాయి. సింహాచలంలో సింహగిరి కృష్ణమాచార్యుల వారు అనే ఒక మహా భక్తులు ఉండేవారు. వారు రామానుజులకు సమకాలికులు. వారు చక్కగా గానం చేసి వరాహ నరసింహ స్వామిని ప్రతిదినం రాత్రి

ఏకాంత సేవలో సేవించేవారు. వారి గానానికి పరవశించిన స్వామి నేరుగా బాలుని రూపంలో ప్రత్యక్షమై నాట్యం చేసేవాడట. ఈ విధంగా కొంతకాలం గడచిన తరువాత, ఒకనాటి రాత్రి కృష్ణమాచార్యుల వారు, స్వామితో “నాకు మోక్షం లభిస్తుందా? నిన్ను నేను ప్రతిదినం సేవిస్తూ ఉన్నాను కదా?" అని అడిగారట. లేదని స్వామి అన్నాడట. "అది ఏమి స్వామీ? రోజూ నిన్ను సేవిస్తున్నాను కదా? నాకెందుకు మోక్షం కలుగదు?" అని మళ్ళీ కృష్ణమాచార్యులు అడిగారట. "నీవు పాడావు, నేను ఆడాను ఒకదానికి ఒకటి చెల్లు" అని స్వామి అన్నాడట. అప్పుడు మళ్ళీ కృష్ణమాచార్యుల వారు "నాకు మోక్షం కావాలంటే ఏ విధంగా లభిస్తుంది?" అని అడిగినప్పుడు "నీకు భగవద్రామానుజుల సంబంధం వల్లనే మోక్షం కలుగుతుంది" అని స్వామి సమాధానం చెప్పాడట. ఆవిధంగానే, కృష్ణమాచార్యుల వారు రామానుజులను ఆశ్రయించి తరించారనే ఒక ప్రసిద్ధమైన ఐతిహ్యం ఇక్కడ స్మరించ దగినది.

ఈ విషయం ప్రమాణం వల్ల తెలియడమే కాదు, పలు వృత్తాంతాలు కూడా దీనిని నిరూపిస్తున్నాయి. వాటిలో శబరి వృత్తాంతం ఒకటి. శబరి అనే బోయ వనిత వృద్ధురాలు. చిరంజీవిని. ఈమె మతంగముని శిష్యురాలు. తన ఆచార్యుని చిరకాలం సేవించి ఆచార్యాభిమానాన్ని పొందింది. మతంగముని పరమపదించేటపుడు శబరితో "నేను వెళ్ళిపోయినా నీవు నా దగ్గరకు రావడానికి తొందర పడకు. దశరథ కుమారుడైన శ్రీరాముడు ఇక్కడకు రాగలడు. ఆ స్వామిని సేవించిన తరువాత నీవు నా వద్దకు రావచ్చు" అని అన్నాడు. ఆ విధంగానే శబరి శ్రీరాముని రాకకోసం ఎదురు చూచింది. కబంధుడు కూడా శ్రీరామునితో **"శబరీం ధర్మనిపుణా మభిగచ్ఛ"**– శబరిరి దగ్గరకు వెళ్ళమని చెపుతూ, ఆమె ధర్మ నైపుణ్యం కలిగినది అని అన్నాడు. ఇక్కడ శబరి ఏ ధర్మంలో నిపుణురాలు? అనేది గమనించాలి.

ఆచార్య సేవే పరమధర్మంగా శబరి భావించి ఆచరించింది. ఇందువల్ల ఇక్కడ ధర్మమనే పదం ఆచార్యాభిమానం అనే చరమోపాయాన్ని తెలుపుతుంది. ధర్మశబ్దం ఉపాయ వాచకం కదా. ఈ విషయమే అరణ్యకాండ లోని 75 వ సర్గలోకూడా "**తాం తు ధర్మే స్థితామ్**" అని తెలుపబడింది. ఇక్కడ కూడా ధర్మశబ్దం ఆచార్యాభిమానాన్ని తెలుపుతుంది. ఇటువంటి చరమోపాయనిష్ఠురాలైన శబరిని అనుగ్రహించడం కోసం రామచంద్ర మూర్తి ఆమె దగ్గరకు వెళ్ళాడు. ఆమె సమర్పించిన ఆరాధనను ప్రీతితో స్వీకరించాడు. దీనిని సంక్షేప రామాయణం "**శబర్యా పూజితః సమ్యక్**" (శబరి చేత చక్కగా రాముడు ఆరాధింపబడినవాడయ్యాడు) అని తెలిపింది. అంటే, చరమపర్వనిష్ఠురాలైన శబరి చేసిన ఆరాధనను శ్రీరాముడు ప్రీతితో స్వీకరించాడు – అని అర్థం. ఆత్మ సఖుడైన గుహుడు ఇచ్చిన ఆతిథ్యాన్ని శ్రీరాముడు స్వీకరించలేదు. "**న హి వర్తే ప్రతిగ్రహే**" అని సున్నితంగా తిరస్కరించాడు. కానీ, ఏ పరిచయం లేని శబరి చేసిన పూజను ఆదరంగా స్వీకరించాడు. దీనికి కారణం ఆచార్య సంబంధమే కదా.

ఈ సదాచార్య సంబంధ ప్రభావం ఇంతటితో ఆగలేదు. శబరి పుణ్యపాపాలను అన్నిటిని భగవంతుడైన శ్రీరాముడు తన కటాక్షంతో తీర్చాడు. ఈ సంగతిని శబరి స్వయంగా పలుకుతూ "**చక్షుషా తవ సౌమ్యేన పూతాస్మి రఘునందన**" - రామచంద్రా! నీ కటాక్షంతో నా పుణ్యపాపాలు తీరిపోయాయి –అని అన్నది. వేదం "**ఉభే విద్వాన్ పుణ్యపాపే విధూయ**" అని, **ఆళ్వార్లు "శార్ న్ద ఇరు వల్ వినైకళుమ్ శరిత్తు"** అని మోక్షప్రాప్తికి పుణ్య పాపాలు రెండు తీరాలని అన్నారు. పుణ్యం, పాపం అనేవి బంగారుసంకెల, ఇనుపసంకెల వంటివి. రెండూ ఉద్దేశానికి అడ్డేకదా.

తన వద్దకు వచ్చిన రాముడు సాక్షాత్తు భగవంతుడే అని శబరికి తెలుసు. అందువల్లనే ఆమె "**పాదమూలం గమిష్యామి యానహం పర్యచారిషమ్**" (రామచంద్రా! నేను సేవించిన ఆచార్యుల పాదసన్నిధికి చేరాలని ఉంది), అని అన్నది. శ్రీరాముని కటాక్షం వల్ల పుణ్యపాపాలు తీరిన తనకు మోక్షం తప్పక లభిస్తుంది అని శబరికి తెలుసు. అయితే, ఈ మోక్షం కూడా ఆచార్య సంబంధ పూర్వకంగా కావాలని శబరి కోరుకోవడం ఆమె చరమపర్వనిష్ఠాత్మక స్వరూపానికి అనురూపం కదా. ఆ విధంగానే శ్రీరాముడు కూడా ఆమెను ఆమె ఆచార్యసన్నిధికి చేర్చాడు– అని మనం భావించాలి. లేకపోతే తత్క్రతు న్యాయం సిద్ధించదు కదా. శబరిలోని ఈ గొప్పతనాన్ని దేశికులుకూడా "**కాపి శబరీ**" అని సాభిప్రాయంగా సర్వనామ శబ్దాన్ని ప్రయోగించడంద్వారా సూచించారు. పురాణ తిలకమని ప్రసిద్ధి చెందిన శ్రీ భాగవతంలోకూడా "**త్వత్పాదపూతేన మహత్కృతేన తరంతి భవాబ్ధిమ్**" – ఆచార్యులు ఉపదేశించిన జ్ఞానంవల్ల సంసారం సాగరంనుండి విముక్తి లభిస్తుందని చెప్పబడింది. "**మహత్కృతేన**" అనే పదం ఆచార్యోపదిష్ట జ్ఞానాన్ని తెలుపుతుంది. ఇక్కడ చెప్పపడిన సంసారవిముక్తి మహానంద ప్రాప్తికి ఉపలక్షణం. ఈ మధ్యకాలంలో వానమామలై చిన్నకలియన్ స్వామి సంబంధం వల్ల, పెద్ద జీయర్ స్వామి సంబంధం వల్ల వేలాదిమంది తరించిన విషయం ఇక్కడ స్మరించవచ్చు.

ఇంతటి వైభవం కల ఆచార్యరూపాన్ని భగవంతుడు కూడా ఆశపడి ఎన్నోసార్లు ధరించాడు. భగవంతుడు ఎత్తిన అవతారాలలో ముఖ్యమైనవి పది అవతారాలు. వాటిలో మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, రామ, కృష్ణ అవతారాలు జ్ఞానావతారాలు. హంస,హయగ్రీవావతారాలు కూడా జ్ఞానావతారాలే. భగవానుని జ్ఞానావతారాలను ఆళ్వారులు

ప్రస్తావించారు. "**పీతకవాడై పిరానార్ పిరమకురువాకి**" అని పెరియాళ్వార్లు, "**అఱియాదన అఱివిత్త అత్తా**" అని **నమ్మాళ్వార్లు,** "**కలైకళుమ్ వేదముమ్ నీదినూలుమ్ కఱ్పముమ్ శొఱ్పొరుళ్ తానుమ్ ఱ్ఱఱ నిలైకళుమ్ వానవర్ క్కుమ్ పిఅర్ క్కుమ్ నీర్ మైయినాల్ అరుళ్ శెయ్దు**" (కళలను, వేదాలను, ధర్మ శాస్త్రాన్ని, కల్పశాస్త్రాన్ని, నిరుక్తాన్ని, ఇంకా మిగిలిన అన్ని విద్యలను దేవతలకు, ఇతరులకు దయతో అనుగ్రహించిన స్వామి ) అని తిరుమంగై ఆళ్వార్లు పలికారు.

ఈ విధంగా సదాచార్య సంబంధంవల్ల తత్వజ్ఞానాన్ని పొందినవానికి పరమాత్మ ప్రాప్తి కలుగుతుంది. అతడు పరమాత్మ సన్నిధానం చేరినప్పుడు "**స స్వరాట్ భవతి**" అనే విధంగా బద్ధ దశలో కలిగి ఉండే సకల విధాలైన పరిమితులను, లోపాలను తీరినవాడై, పరిపూర్ణమైన స్వస్వరూపాన్ని పొంది, స్వరూపానురూపమైన పరమాత్మ సేవను సర్వకాల సర్వాదేశ సర్వావస్థలలో సర్వ విధాలుగా నిరంతరాయంగా ఆచార్యసంబంధ పూర్వకంగా చేసుకోగలుగుతాడు. పరమపదంలో ముక్తుడు చేసే కైంకర్యం కూడా ఆచార్య పురస్సరంగా ఉంటుంది– అనే విషయాన్ని యామునులు స్తోత్ర రత్నంలో "**అత్ర పరత్ర చాపి" అని అంటూ సూచించారు కదా. బ్రహ్మవిద్యోపాసనవల్ల "తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యే**" అని ప్రకృతిసంబంధవిమోచనం శరీరావసానంలో కలుగుతుందని చెప్పబడింది. ఇది పరమాత్మప్రాప్తికి ఉపలక్షణం. ఈ ఫలమే ఆచార్య సంబంధంవల్ల జ్ఞానాన్ని పొందడం ద్వారా కలుగుతుందని తెలుస్తున్నది కదా. అందువల్ల ఆచార్యోపాసనంద్వారా బ్రహ్మవిద్యోపాసనతో సమానం– అని భావించడంలో ఏమాత్రం అడ్డు లేదు.

ఇటువంటి ముక్తుని పరమాత్మ మళ్ళీ తిరిగి ఈ సంసారలోకంలోకి విడిచిపెట్టడు అనే సంగతిని **"న చ పునరావర్తతే"** అనే చివరి బ్రహ్మ సూత్రం, దానికి శ్రీరామానుజులు చేసిన రస్యమైన వ్యాఖ్యానం తెలియజేస్తున్నాయి. పరమపదంలో ముక్తుడు చేసుకోగలిగిన కైంకర్యం ఎటువంటిది? అనే విషయాన్ని కూడా పెరియాళ్వార్ పల్లాండు ప్రబంధం చివరిలో **"శూఝ్న్దిరున్దేత్తువర్ పల్లాండే"** అనే సూక్తి ద్వారా తెలిపారు. ఈ అర్థాన్ని మనం వేదంలోని **"తద్విప్రాసో విపన్యవో జాగృవాంసః సమింధతే"** అనే సూక్తిలో దర్శించవచ్చు.

అందువల్ల ప్రతి వ్యక్తి సదాచార్యుని ఆశ్రయించి, ఆ మహనీయునివల్ల తత్త్వజ్ఞానాన్ని పొంది, తద్వారా భగవదనుగ్రహాన్ని నోచుకొని తరించాలని, తరిస్తారని భావిస్తాను.

**సర్వేపి సుఖినః సంతు**
**సర్వే సంతు నిరామయా,**
**సర్వే భద్రాణి పశ్యంతు**
**మా కశ్చిత్ దుఃఖభాక్ భవేత్.**

